

శ్రీ

# కాకానీశ్వర శతకము

బ్రహ్మశ్రీ బండ్లమూడి వేంకటశాస్త్రి

కృతము.

పెదకాకాని

శ్రీ మల్లేశ్వరస్వామి దేవస్థానము

వారి ద్రవ్యసహాయముతో ముద్రింపబడినది.

మొదటికూర్పు 2000 కాపీలు

అనసూయ ముద్రాక్షరశాల, గుంటూరు.

1938

 [ వెల 0-1-0



శ్రీ

# కాకానీశ్వర శతకము

బ్రహ్మశ్రీ బండ్లమూడి వేంకటశాస్త్రి

కృతము.

పెదకాకాని

శ్రీ మల్లేశ్వరస్వామి దేవస్థానము

వారి ద్రవ్యసహాయముతో ముద్రింపబడినది.

మొదటికూర్పు 2000 కాపీలు

అనసూయ ముద్రాక్షరశాల, గుంటూరు.

1938

 [ వెల [illegible]

# విజ్ఞప్తి

భక్తాగ్రేసరులారా!

పరమేశ్వరానుగ్రహమున, శ్రీ కాకానీశ్వర శతకమును ప్రచురింపగలిగినాము. ఈశతకమత్యంత రసోపేతమై, భక్తజనమున కాహ్లాదమును గలిగించునదై యలరారుచున్నది. ఇది బ్రహ్మశ్రీ బల్లెమూడి వేంకటశాస్త్రిగారిచే రచియింపబడి, శ్రీ పెదకాకాని మల్లేశ్వరస్వామివారి సందర్శనార్థ మేతెంచు భక్తజనోపయోగార్థము, శ్రీ స్వామివారి దేవస్థానమువారిచే అచ్చొత్తింపబడినది.

భక్తులందరును భక్తిరసపూరితమగు, యీశతకమును చదివి ఆనందించుటయేగాక మున్ముందిట్టి పుస్తకములను దేవస్థానముతరఫున ప్రచురించి భక్తిప్రచారము చేయుటకుగాను తోడ్పడవలసినదిగా వేడుకొనుచున్నాను. ఉడుతాభక్తి యనునట్లు, శక్తివంచనలేకుండా తామెల్లరుచేయు ధనసహాయమునకు దేవస్థానమువారు కృతజ్ఞులు. మంచిపనులను చేయుటయందాదరము జూపు తమబోట్లకు యింతకుమించి వ్రాయనవసరము లేదు.

సర్వేజనా స్సుజనో భవంతు.

పెదకాకాని

1—2—38

ఇట్లు బుధజనవిధేయుడు
మల్లెపెద్ది శ్రీకృష్ణయ్యచౌదరి
శ్రీమల్లేశ్వరస్వామివారి దేవస్థానం మేనేజరు

శ్రీ

శుభమస్తు

శ్రీ హయగ్రీవాయనమః

# కాకానీశ్వర శతకము

(౧)

మ॥ పరమబ్రహ్మకెక్కనభక్తి వేడదనునే భాగ్యాలవాలా సదా
సదయా నిర్మలచిత్త శంకర మహాత్మా సర్వాత్మ గోత్రాప్పపా
మదిలో నెంచుము నీనిగా తుమనుచు న్మాన్యాత్మస ర్వేశ్వరా
పెదకాకాని పురాధినాథ శివ నన్బ్రేమన్వడిన్బ్రోవుమా.

మ॥ సదయాపాంగ శశాంకశేఖరుడ యీశా లోకరక్షామణీ
త్రిదశాధీశ మునీంద్రసేవితపదా దేవప్రభావోన్నతా
యుదయానీకహృదంతరాళతతిహాహాకారసంధాయకా॥ పెద॥

మ॥ విదితంబయ్యెను నీదుకీర్తి దిశల న్విశ్వేశ్వరా భక్తులన్
పదిమారుల్ దరిజేరి వారికభయమ్మా బ్రహ్మాండమా బ్రోచెదన్
యిదినాకెంతటిగొప్పకార్యమనుచున్ యేపేర్పడన్నావగా॥ పె॥ 3

మ॥ సుదినంబౌనది సూర్యుడింద్రదిశలో శోభిల్లు కాలంబునన్
పదిమారుల్ శివ శంకరాయనుచు సంభాషించినన్ భక్తితో
పదనంబానన చేయుసన్మతులు వేదాంతార్థమిందేరుగా ॥పె॥ 4

ఇదినీకిచ్చును బుచ్చుకొమ్మనిదయతో నీభక్తిసద్రత్నము
న్నెదకాకానిపురాధినాథ శివ నన్నేమున్నవేడిన్నోయ్పుమా. 11

మ॥ మదమాత్సర్యవిహీన మానసుడ నెమ్మాయిమ్ము
మాకిష్టముల్
యది గాకుండిన గోల జేతుము నినున్ యత్నా సౌజన్యమున్
హృదిభావింతుము దేవదేవ సదయా యిందీవరాక్షా వరా॥ నె॥

మ॥ మది రాత్రిస్ఫురిమరాంబగూడిగుడిలో మత్తైభసచ్చర్మమున్
మదిదీర న్మోయినిండగప్పుకొని సన్మానించుచు న్భామినిన్
పదిలంబేర్పడబంధుకొందువసదాబద్ధాక్షులెమ్మాయిక॥ న్నె॥ 13

మ॥ ఇదిగో భస్మము బుష్పజాలమిదిగో యిమ్మైనగోక్షీరమున్
ఇదిగో బాద్యము దివ్యవస్త్రమిదిగో యీశాన్యదిక్పాలకా
ఇదిగో గంధముగాంగవారియిదిగో యింపొప్పుశాల్యన్నము॥ న్నె॥

మ॥ సదయాయిమ్ము వరమ్ము వేగముగ చాల్పాలించుగా దైన్యమున్
ముదము న్గొందుచువచ్చుభక్తతతిసమ్మోహమ్ముపోగొట్టుమా
ఉదయంబాదిగ వేడుచుందుముగదా యుత్ఫుల్లపద్మేక్షణా॥ నె॥ 15

మ॥ తుదిహీనుండవు నిర్వికారుడవు సంతోషాబ్ధి మగ్నుండవున్
ముదిమిన్జెందని దివ్యరూపుడవు సమ్మోహవ్యధాసంహరా
మదినుత్సాహము గల్గజేయుముమహాన్మాంగళ్యసంధాయకా॥ నె

మ॥ మొదలున్నంతము లేనివాడవునుసమ్మోహాంధకారాగ్నివిన్
గద చేతన్గొని దుష్టదానవతతిన్ ఖండించు వీరుండవున్
ఉదితానందఘనాభిరాముడవు క్షీరోదాత్తమిత్రుండవున్॥ నె॥ 17

మ॥ సదయుల్శాంతులుధీరసత్తములుసంసారుల్బుధేంద్రోత్తముల్
విదితానంద ఘనాభిరాములును యుర్వీనాథులాశావశుల్
మదిలోనెంతురుగా చెలిన్నువిభవోన్మత్తుల్సదాధీవరా॥ పె॥ 18

మ॥ త్రిదశవ్రాతము వాసవౌఘుము మహాదేవాభిధానున్నినుం
మదిభావించియెయుత్సహించెనుగదామాన్యన్ప్రమోదాన్వితు
న్యదఘస్వర్భనుమంధరాచలముచేయుద్యోగ సంభావితున్॥ పె॥

మ॥ మృదుపాదాంబుజ నీలకంఠవరదామీనాక్షిలోలా శుభాం
కద దివ్యాభరణాఖిలాశ్రయ శశాంకాగ్ని ప్రభావిస్ఫుర
ద్వదనాశాశ్వతరమ్యభూషణలసద్వాదప్రకారాంచితా॥ పె॥

మ॥ సదసంబారయ నిష్కళంకము తనుచ్ఛాయాతిరమ్యంబు శా
రదచంద్రాననజాయ పుత్రులుమహారమ్యాస్పదుల్మిత్రులున్
సదయుండీవునమస్తకాలములువాంఛల్ప్రస్తుపిష్టాలికిన్॥ పె॥ 21

మ॥ అదరుష్ట్రయ్యము నీకు పేరువిని తానల్లాడు హాహాయనున్
బెదరున్భీతిలు పేరువిప్పను శివా శ్రీమాయనున్ శంకరా
ఇదిగాకీర్త్వశి నేనునేర్పడికొంఘక్లేశ్స్థాన సంపాదకా॥ పె॥ 22

మ॥ వదలజ్ఞేయుము సర్వరోగసమితి న్వాంఛల్వడి స్వార్పుమా
ముదమున్నొందగజేయుమా హరుడ సమ్మోదాద్రిమూర్థోజ్వలా
మదినేనెంచినకార్యమిమ్ముదయుంశో మార్తాండతేజోనిధీ॥ పె॥

మ॥ మొదలేనీవనిబల్కువేదతతి సమ్మోదింతురామాటకున్
త్రిదశుల్జ్ఞానఫలార్థులుత్తమ ధరిత్రీశుల్మునీంద్రోత్తముల్
విదితజ్ఞానులుశాస్త్రవేత్తలగుబృహ్స్వదేవ్రులత్యంతమున్॥ పె॥ 24

సుదతీ రత్నచయంబు లింపుదనరన్ శోభిల్లు హారాళితో
నుదకాపూరిత రుక్మపాత్రతతితో నుత్ఫుల్లపద్మాళితో
గదతెన్నుప్పఫలాళితోగనుము వేగామారిదివ్యాకృతీ॥ పె॥ 25

మ॥ చదువుల్ సంధ్యలు వేదశాస్త్రములు యోగాధీశ నీవేగదా
మదిలో నెన్నిన మెన్నిమారులును భీమా వేదవేద్యాలయా
మదిచాంచల్యముగల్గ వేరునగుసామాధ్యక్షబోధాలయా॥ పె॥

మ॥ మదినీవేగద కార్యకారణ సమామాసంబులు నీ్న వెగా
సుదినంబుల్ క్రతుజాలమున్ ఋతువులాశోద్దేశ్యనామంబులు
న్మదిసూహించిననీవెగా వెసదయామాభాగ్యమాశ్రీకరా॥ పె॥ 27

మ॥ ఇది నాకేలర సుందరాంగ విజయా యిమ్మాదగన్గోరికల్
సదయాసర్వమునీంద్రహృద్యహృదయాశాంతాకృతీ॥ రహా
విదితానందసు రేంద్రవంద్యచరణా విశ్వేశ్వరావిశ్వదా॥ పె॥28

మ॥ గుదబంధంబొనరించి గాల్మడిమచేగూర్చుండి బల్లక్కగా
మది నీకర్పణజేసి సంతతము కామారి న్నినున్వేడినన్
మదినుత్సాహముగల్గదాగననుభీమాక్షునాపైదగన్॥ పె॥29

మ॥ మదసంసక్తులుశాంతచిత్తులునుసామాన్యుల్సుధుల్బోధులున్
విదితాజ్ఞాన వినాశహేతువులు వేశ్వేరాను యాజ్ఞానికి
న్మదిబంధింతె మానసోత్తముల కీమార్గంబులేపారునా॥ పె

మ॥ సదయా పద్మభవాదిదేవతలు విశ్వాసాధికుం డీవుడే
ముదమున్దేయునటంచు మెచ్చుదురుసమ్మోదంబుతోనిన్సదా
ఇదినీకేగలదయ్యశంకరుడ యింకేసాధ్వికిన్ లేదుపో॥ పె॥31

మ॥ మదిరాపాంగ సురాంగనాసక్తపదా మాలిన్యహీనా వరా
కుమారేశ్వాటును జేసి నాకుమదిలో కూర్చుండుమా సర్వదా
ఇదె నేగోరెద నిమ్ము నాకిపుడె దుర్గేశ సంధాయకా॥ పె॥32

మ॥ అదియున్ రావణుజంప రాఘవుడు తా నాజిన్బ్రనన్నామము
న్మదిలోనెంచి మరొక్క మూరుగను కుర్మాగ్గున్నురారీశ్వరున్
ఉదరంబారున గొట్టి బాణతతి చేయున్మాలముజ్జసెగా॥ పె॥33

మ॥ మృదువాక్యామృతసిక్త భక్త జన భూమీంద్రేశ దివ్యాకృతీ
పదపద్మద్వయ మెన్నుడెక్కె దను గోత్రా దేవదేవోత్తమా
పదలజ్జేయుము పాపసంఘమును మా వాంఛల్లయు న్గూర్పుమా॥ పె॥

మ॥ అదియాహ్లాదవహారా మృదువాత్పాలపదాయానంద బోధాశిఖీ
పదిలంబేప్పుడె జేయుమా శుభము మాపాపంబులన్ద్రుంపుమా
ఇది యే గోరితి నేననిత్యమును నేమింకేమియాలోచనా॥ పె॥35

మ॥ అది నీచేతనుగాక యున్న జెప్పుమా యన్యయ్యనే వేడెదన్
అది గాకుండిన నంబతో జెపుదు నాప్తుంబుతో నీశ్వరా
మృదువాక్యామృతమీయుమా దయను నామీద న్దయ
న్జూపుమా॥ పె॥ 36

మ॥ మదమున్వీడితి మత్సరంబును వడి న్మల్లేశ్వరా వీడితిన్
కుదిరెన్భక్తి దిగీశ నీకుపయి నాకోర్కెల్లయు న్గూర్పుమా
పదపంకేరుహమిమ్ము సద్హృదయ సద్భాగ్యసదానందదా॥ పె॥

మ॥ మృదువస్త్రావళి మీదగప్పుకొని యేమీదీని భాగ్యంబునన్
అదిగో వచ్చుచునుండె సత్ప్రభయు గంగాధీశ రత్నాళితో
మదిదీర న్నభ మొత్తు మన్స్వరగతిన్ మల్లేశ ఘంటాళితో॥ పె

మ॥ అదరచ్ఛాభమిన్నపేంద్రజాలముమహాహంభావయుక్తంబుగా
గదలెన్నీను పదారవిందములు గాంక్షుల్లీర సేవించనో
సదయానందద సత్యసంధవరదా సర్వేశ్వరాశంకరా॥ పె॥39

మ॥ పదిరూపంబులుదాల్చి మాధవుడుకోపాటోపమేపార దుర్
హృదుపై బాణపరంపరల్జొనిపితా హింసింప నీనామము
స్పదిమారు ల్మదినెంచివేయుశరముల్బ్రాంతంబుతోనీశ్వరా॥ పె

మ॥ చదువాలేను మరేమియున్జనక యాశా నాకుబల్లెస్సదా
ముదిమిన్జెందకుమానసంబు నోగు పైమోసంబులన్జేయుగా
నిదిగూఢస్గలదయ్యగూఢమతినై యేప్రొద్దునేనుండెదన్॥ పె॥

మ॥ అదరన్గొట్టెగు సత్యవాక్యవిభవు న్నన్యాయు జేబట్టెదన్
బెదరింతు న్శివశంకరాయనెడి గంభీరాత్మ నెల్లప్పుడున్
ఇదినేనెప్పుడుదప్ప సత్యమిదియూనీశామదిన్యాశ్వితా॥ పె॥42

మ॥ కదలీనింబరసాలసాలవకులారామాశోకపున్నాగ బి
ల్వదళాభూషిత రమ్యరత్ననిలయా వ్యాసాదినుత్యాస్పదా
మదనాహంకృతిసంహరామృదువిదామల్లేశ్వరాశ్రీకరా ॥పె॥

మ॥ మృదువల్లీశతకాంతిభూషిత మహామృద్వంగిగంగాసతీ
వదనాంభోజసుదీప్తిదీపితపదా వాంఛ ల్దయన్గూర్పుమా
పొదలున్బుష్పచయంబులున్నదులుకుంపుల్గాడిరాసాగిరా॥ పె॥

మ॥ నదముల్నాశ్వితరత్న భూషిత మహానాగేంద్రజాలంబులు
న్నుదధుల్పర్వతరాజబృందములు హీనోద్భిన్న వృక్షంబులు
స్పదముల్గొక్కను వచ్చియుండెను మహాభాగ్యాలవాలా
శుభా ॥పెద॥ 45

మ॥ మృదురత్నద్యుతి దీపితాంబర లసన్మృద్వంగి దుర్గామిళ
న్మృదుసర్వాంగవిభూతిభాసిత మహామృద్వంగ చంద్రాననా
మృదుదివ్యాభరణామృదూన్నతపదామృద్వన్నభోక్త్రాసుధీ॥ పెద॥

మ॥ ఉదయంబందున లేచి యాలయము భక్త్యుద్రేకత జూచినన్
పదిమారుల్మరినీదు నామమును సంభాషించినన్భక్తిచే
ముదమేర్పాటగు గల్గుభాగ్యమును నామోదాఖ్యాతసత్వాధికా ॥పె

మ॥ పదపద్మంబులదట్టుచు న్భువినితా బల్మారుని న్వేడుచున్
ఇదిగో యీశ్వరునాలయంబనుచు నార్యేశానినున్నమ్మియే
యదిగో వచ్చుచునున్న దశ్వతతి యాహా యంచు సంతోషిమై॥ పె॥

మ॥ ఇదిగో జూడు మరాళకుంతల భవానీశాబ్జపత్రేక్షణా
మదినిన్నిల్పి బసుందు నిత్యమును గామారి ననుంబ్రోవుమా
యిదె నాకీయము బుత్రభిక్షమను చున్నీకితిగా వేడుచున్ ॥ పె॥49

మ॥ మదమాతంగ రథాశ్వగోమహిష సామ్రాజ్యాదిభాగ్యావళి
న్మదినేనెంచిదలంచినాడనిను గామాధిక్య మేపారగా
సదయా యిమ్మరయంబు సన్వగడసి సామర్థ్యము న్జూపుమా॥ పె॥50

మ॥ సదసద్భేదవిహీనమానస సరోజా సక్త పాదాంబుజా
మదసంజాతసుగర్వదూషిత మనోమాలిన్య దోషాపహా
మదనాహంకృతిగర్వభంగచతురామాన్యాసతీవల్లభా॥ పె॥

మ॥ మదినేగోరెదబుత్రసీయుమని శ్రీమాదేవ భాగోన్నతు
న్సదయు న్శాంతు సద్గుణాలయు మహాచార్వాంగు దీర్ఘాయునిన్
మదిరాపాంగుని బూర్ణచంద్రసుముఖు న్మాన్యు న్బుధేంద్రో
త్తమున్॥ పెద॥ 52

మ॥ సదయానందద శత్రుసూదనమహాసామర్థ్యపూర్ణాకృతీ
త్వదధీనంబు సమస్తమైనజగమున్ త్వద్రూపమత్యంతమున్
ఇదిభావించిన గల్గుమోక్షము భవానీశాజగద్రక్షకా॥పె॥53

మ॥ మదిభావించెద మోక్షదాయివని నన్మత్తేభ భర్మాంబరా
ముదదా సర్వసుఖావళిప్రద సదామూర్ఖప్రజాసంహరా
తుదిహీనా సకలార్థ సిద్ధిద మహాతోషాలవాలా శుభా॥పె

మ॥ ముదదాశంకర మోక్షదానపర వామోరుప్రియాప్రాప్తిదా
హృదయానందద సర్వకామఫలదా హీనాతిరిక్తాస్పదా
పదమానందదమీయుమావరద యాప్తానందగౌరీశ్వరా॥పె॥

మ॥ సదయా జూపుమునీసురూపమును నాశాఢ్యశపుత్రాళితో
పదముల్మ్రొక్కెడి భక్తరాజతతితో భార్యాళితో నిత్యము
న్ముదముంజెందుచునున్న దానినిసదా మోదంబుగల్పింపుమా॥పె॥

మ॥ పదముల్మ్రొక్కెద భక్తినీయుమ దయన్ బాపాత్ము జేపట్టుమా
ముదముఙ్గూర్పుము ముక్తిలాభము మహామోదంబుతో జూడుమా
ఇదిగో రాయని యిమ్ము గోరికనునోయీయయంచు మాట్లాడుమా॥పెద॥ 57

మ॥ సదయాయిమ్ముజయంబులెల్లెడలయాశాపూర్తిగల్పింపుమా
వదలన్జేయుముదుష్టబుద్ధిని దయ న్వర్ధిల్లగాజేయుమా
గుదురన్జేయుముగుంపుగా శుభములన్దోషంబు వారింపుమా॥పె॥58

మ॥ కదనంబెందును లేకయుండునటుల న్గల్పింపుమా సద్దయన్
సుదినంబుల్దయగూర్పుమా వరద వేసోల్లాస సంభాషణల్
గుదిగూడన్దయ సేయుమా శుభద సాంగోపాంగ సర్వార్థదా॥పె॥

మ॥ సదయానేకసహస్రకోటి యువతీసంఘంబు లత్యంత భ
క్తిదలిర్పన్వియదావృతస్ఫురణచే దీపించుచున్దిక్కులన్
ఇదిగో వచ్చుచునున్న వో శుభదనిన్నింపొప్ప వేవేడుచున్॥ పె॥60

మ॥ సదయా నిర్మలభూషణాంచితతనుచ్ఛాయాతిరమ్యాంబికా
వదనాంభోజసుదీప్తిభూషిత మహోవక్షస్థలప్రాజ్ఞ నా
రద వాల్మీకి వశిష్ఠ గౌతమమునీంద్రాభిస్తుతానందదా॥ పె॥61

మ॥ ఇదిశృంగారఫలంబు గంధమిది గోత్రేంద్రేశభక్తేష్టదా
ఇదికర్పూరప్రహారతి సుధర సత్స్వర్ణపుష్పసంపాదకా
మదిదీర్ఘనుమయ్యాదీని వరదామాన్యాసుఖానందదా॥ పె॥62

మ॥ గదచేతంగొని దేవయోనిసమితిన్ ఖండంబులన్జేసియు
న్మదపాపాత్ముల పీచమున్కణచి సన్మార్గాత్ములంబ్రోచియు
న్మదమున్ జెందగిరీశ కావుమననున్మిద్దొప్ప శాతోదరా॥ పె

మ॥ పదునాల్గేడులు నిన్ను గొల్చి యెగదా భావంబులో నెప్పుడున్
తుదియుద్ధంబునద్రుంచె రావణుని నీతో నాటియే రాముడున్
అదిగాకన్మది నెంచు గృష్ణుడును నాహా నీదు నామంబు నే॥ పె॥64

మ॥ మదనోద్రేకులు మానమానసులు సన్మార్గానుసంచారులు
న్మదిమిం జెందిన ధీరసత్తములు నామోదించి నీనామము
న్మదిలో నెంతయు గాదె నిత్యమును గామారీ సురాధీశ్వరా॥ పె

మ॥ హృదయానందదవిశ్వరూపవరదా హృద్యాత్మవిద్యాలయా
హృదయంబాదున జేరిచేయు పనులన్ హృద్యంబుతో గూర్పుమా
విదితంబైతనరారు నీదుమహిమా విస్తీర్ణపత్రేశ్వరా॥ పె॥ 66

మ॥ మదహా క్రోధహా మత్సరాపహా మదోన్మత్తారి గర్వాపహా
యదురాడ్వంశజకృష్ణమూర్తిహృదయాహ్లాద స్ఫురద్విగ్రహా
బెదరజ్ఞేయముముదయ్యమున్నభదమాభీతిన్వడిన్బ్రాపుమా॥ పె॥

మ॥ కుదరజ్ఞేయముమునాగజాడ్యమునుసంకోచంబుబోగొట్టుమా
ఇదిగోరాయుని యిమ్ములమంకువడిగా యేపార గన్పింపుమా
ముదిజాయామణితోసమున్నతమహామోదంబుతోముందరన్॥ పె

మ॥ మదదావానల కాలమేఘవిభ కామారణ్య దావానలా
యదయానీక గజేంద్ర సింహా సరసాహ్లాదాభివృద్ధిప్రదా
పదపంకేరుహమేసుప్రెముక్కదనుసంభావించ మాహ్లాదుమా
పెదకాకాని పురాధినాథ శివ నన్నేమన్వడిన్బ్రోవుమా. 69

మ॥ సదయుండందురునిన్నుగొందరు మహాసంతోషి గాగొందరు
న్మదదాయీయుని గొందరందురుజుమీ ముద్దొప్పనాకిప్పుడీ
ముదమున్గూర్చినసత్యమైదనరుసమ్మోహాగ్ని కాలాంబుదా॥ పె

మ॥ ఇదిరానీకు పరాక్రమంబు వరదా యిన్నాళ్లు నేవేడిన
న్మదిలోగల్గను వీనిగాతుమనుచు న్మల్లేశ్వరానికు ని
హృదయంబార్ద్రమటంచు బల్కుదురు నేనిమాట నేనమ్మితిన్ ॥ పె

మ॥ విదితబ్రహ్మంబు నిన్నుదల్తురుమదిన్విజ్ఞాన సద్రూపుగా
మదనోద్రేక విశిష్టమానసులు రామారూపవామాంగుగా
ఇదెనేనెంచుదు భక్తమానసిక సర్వేష్టార్థసంపాదిగా॥ పె॥ 72

మ॥ సదయుండైన కిరీటిమున్నుమదిలోచాలొప్పయేమంత్రము
న్మదమొప్పారబఠించెనోయదియె నేమోదంబుతోమంత్రము

న్నదయుల్ మెచ్చబఠింతు నెప్పుడును బల్నంతోషచిత్తుండనై
పెదకాకాని పురాధినాథ శివ నన్బ్రేమన్వడిన్బ్రోవుమా. 73

మ॥ పద మానందదమంచు వేదతతిబల్రావీణ్యమేపార బ
ల్కు దురాచారులుపొందరాదనియుసంకోచంబు నేమాత్రము
న్మదిలోనెంచకఁడంచునిత్యమనియున్నాన్యాత్మనాకీయుమా॥ పె

మ॥ చదువారంభము జేయబోవుతఱిసంశ్రావ్యంబునీమంత్రమున్
జదివారంభము జేతు ల్లజనులు న్సంతోష మగ్నాత్ములై
ఇదినీమంత్రమహాోన్నతంబుమదిలో నేమంత్రిమున్నాటియే॥ పె

మ॥ వదనంబందునబూసిభస్మమును సర్వాధిక్య నీమంత్రిము
న్మదిలో నెన్నుచు గంఠమందున మహాన్మాంగళ్యగుదాక్షల
న్మదిదీరస్థరియించు మానవుడుసామాన్యాతిరిక్తాత్ము॥ పె॥

మ॥ చదువా యేలను సంధ్యలేలను మహాత్సారంబులున్నేలనీ
పదపద్మంబులు మొక్కుటొక్కటియెచాల్భాగ్యంబుమ
ల్లోశ్వరా
ఇది యేమానవుడొంగునో వరద దేవేంద్రేశ గంగాపతీ॥ పె

మ॥ సదయా శారదచంద్రికాధవళ భాస్వద్రత్న హారోజ్వలా
యదయోదేకనివార కాఖలమునీందాభిస్తుతానందమా
మది ముమ్మాటికి నిన్నె వేడదను నామాలిన్యమున్బాపుమా॥ పె

మ॥ మది యానందమయంబునంతతముసన్మార్గప్రబోధానుగం
బుదితాజ్ఞానవినాశకారణము మహా సోదయ తేజోమయం
బిదినీవాంకి నీకునంగలదు నాకీ సొంపు పుమా॥ పె 79

మ॥ ఇదియాశ్చర్యయుతంబు జంచలము మాయిగాదీని నేమానవు
ల్మదిభావించరు సత్యమిద్దియనుచున్నామ్నాయ్యుల్బుధేంద్రోత్తముల్
ఇదిభావింతురు సత్యమీవెయనుచున్నీబుద్ధినాకీయుమా॥ పె 80

మ॥ మెదడున్ రక్తముచీల్చిదయ్యముగను న్మేలంచుభక్షించుచున్
ఎదలో నెంచుచు భక్తిరాజసమితి న్నెప్రస్తుగా పాడుచు
న్మదితన్గాడి సుఖంబుచేదనరునో మోదాత్మ దుర్గాపతీ ॥పె

మ॥ ఉదయజ్జన్నవవారకామినులు హాసోద్భాస్యదికాంతులై
పద ధా సా యనిపాటపాడుచు మహాభాగ్యాలవాలు న్నిను
న్మదిలోనమ్మి బరుంకీర్తియుడను భీమాక్షర కామాంతకా॥పె

మ॥ మది కారుణ్యరసాభిపూరితము భూమానందసంయుక్తము
స్పదయంబాశ్రితరక్షకంబును మహాసారంబు నిత్యోత్సవా
స్పదమద్రీంద్రతనూజపూజితము సాంబా నీకు యెల్లప్పుడున్॥పె॥83

మ॥ మదధారాధర వాయురూప సకలాత్మానాథ మల్లేశ్వరా
విదితాహారవిహార మోక్షసుఖదా విఘ్నాంతకా సర్వదా
హృదిభావించెదనీదురూపము సదా హీంద్రావిముక్తాస్పదా॥పె

మ॥ ఇదిమందారసుమస్రజంబు శుభదంబింద్రాద్రిసంభావ్యమున్
హృదయానందదమద్రిరాజతనయాహృద్యంబు సర్వోత్తమం
బిదిసర్వర్తుభవంబుదీనిగనుమాయీపరన్బూంచెదన్॥పె॥ 85

మ॥ ఇదినానావిధరత్నపూరితముసుమ్మీ రత్నసద్దామమున్
మదిభావించిన గల్గుసంపదలు సామాన్యంబగున్ దీనికిన్
పదివారంబులు దాల్చునెవ్వడు మహాభాగుండువాడయ్యెడిన్॥పె॥

మ॥ మదిరాపానుడు మత్తచిత్తుడును గామాంధుండు సన్మార్గుడు
న్మదిభావింతురు నీకునామమును సామాన్యంబె నీనామమో
ముదసంయుక్తపుదివ్యమానసుడ సమ్మోదాత్మ నీరోత్తమా॥ పె

మ॥ ఇదినీభవ్యసురూప మిందుధర నేడీరీతి గాన్పించె నా
కికనుగోజూడుచుటంచు మాధవుడు మాయాయంచులో కేశుడు
న్మదినీకర్పణమంచు నింద్రుడును సన్మాన్యాత్మ ముందుండగా॥ పె

మ॥ ఒదవున్భాగ్యసమృద్ధి జంతుతతికి న్నొప్పారనీనామమున్
జనువ స్పద్మభవాది దేవతల కాశల్మీకు సేవింప గో
ష్పదమౌ నబ్ధిదరింప నాస్పదము కాస్వర్గాదిలోకంబులున్॥ పె॥89

మ॥ ఇదిరా నీవగుదివ్యచింతనము నేడీశుండ కన్పించెరా
ముదితోపేతము బుత్రసంయుతము సద్భావాభిసంయుక్తము
న్గనునైయుండెడినీకురూపము మహాగోప్యంబు హాగాలిచే॥ పె

మ॥ త్రిదశేంద్రాగ్రి సుపూజితాంఘ్రియుగళా దేవ త్రిలోకేశ్వరా
మదినీకర్పణజేసినాడ వరదా మాన్యా మృగాంకాంకితా
యెదుటన్నిల్వుముగార్యమేమియనుమా యేమైనమాట్లాడుమా
పెదకాకాని పురాధినాథ శివ సర్వేశ్వరప్రోచుమా. 91

మ॥ ముదితన్గాడిమృగాంక భూషణ సముద్భూతామలాకాగవే
గ దమాసంగత రమ్ముముందరికి నాకార్యంబుసంపూర్తిగా
కుమరస్జైయుముభక్తవాస్సెలుడనాగోద్రిక్తసంభూషణా॥ పె॥92

మ॥ హృదయావాసమనోజ్ఞరూపవిభవా హృద్యాస్పదా శంకరా
బదరీకాననయోగి మానససరఃపద్మాయమానాకృతీ
సదయా సద్గతికారణా శుభ సహస్రాక్షాత్రిలోకేశ్వరా॥ పె

మ॥ త్రిదశానీకకిరీటరత్నచయ సందీప్తచ్ఛటాపాదాంబుజా
మదనాహీంద్రఖగేంద్రచంద్రవదనోమాక్రాంతవామాంగనా
మనింగో జేరి సుఖంబు గాంక్షము సదామల్లేశ్వరాభోగదా॥ పె

మ॥ సుర మాద్యేకతనూభవాసురులు సంక్షోభంబు గావింప ని
న్నుదయాసింధుసు దేవుడో సదయ యునన్నున్గావుమాయంచనన్
ముదముంజెందిభయంబు బాపిశుభసమ్మోదంబు మున్గూర్ప వే॥ పె॥95

మ॥ మదకాలాంబుదఘోర వాయునిభ రామాసక్త వామాంగశా
రదచంద్రానన నందివాహన శుభారాధ్యా స్ఫురన్మంగళా
మదినీకర్పణ జేసి వేడితిని గామారీ చిదానందదా॥ పె॥ 96

మ॥ సువిశంబయ్యెను నేను చంద్రధర సుశుద్ధాత్మ నీరూపు నా
మది భావించినరీతిగన్పడెను నామాన్యంబె నాభాగ్యమో
హృదయానందవథ్య తేర్పడెను బల్ హృద్యంబుగా జూచితిన్ ॥ పె

మ॥ ఇది సామాన్యుల కందరానిపద మిందెవ్వండును లేడు దు
ర్మదు డత్యంత వివేకులందరరయన్ మత్తేభచర్మాంబరా
ఇది నాకబ్బె భవత్ప్రసాదమున నింకేమయ్యె సంతోషమా॥ పె

మ॥ పదమానందకరంబు సంతతము సంభావ్యంబు గంగాధరా
ముదముంజేయును సర్వసంపదలు సంపూర్ణంబుగా గల్గెడిన్
ఇది కాకానిపురంబు దీనికిదె దీటైన లేదెద్దియున్॥ పె॥ 99

మ॥ సదయా శంకర సద్గుణాలయ సమస్తాశావకాశాస్పదా
ఇది నీకర్పణ జేసినాడ వరదా యీశాభవానీయుతా
ఇది సంస్తుత్యము భక్తితో వినిన గానిమ్మానడిన్గోరికల్॥ పె॥100

మ॥ ఇదినానావిధపుణ్యసంయుతముగా నిం.చెన్వదేకోటికల్
మదిభావించిన నిచ్చునీశ్వరుఁడు సామాన్యంబుగా నందరు
న్మదిభావించుఁడి చంద్రశేఖరుని నా మాటల్మదిన్నమ్ముఁడీ
ఇద కాకానిపురాధనాథ శివసద్బ్రహ్మస్వరూపిన్బ్రహ్మమా. 101

బండ్లమూడి వేంకటశాస్త్రి కృత

కాకానీశ్వర శతకము

సంపూర్ణము

